THE ANDHRA PATRIKA, MADRAS.



# ఆంధ్రపత్రిక



Regd. No. M, 1118 | సంపుటం 38. సంచిక 176 | FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO. | గురువారం 27-9-1951 | వెల 1 అణా, పోస్టు 0-1-2.

# "ఆంధ్రరాష్ట్రం ఎంత త్వరగా ఏర్పడితే అంత మంచిది"

## అక్టోబరు 3 తరువాత అబదాన్‌లో బ్రిటిష్ ఉద్యోగులు ఉండరాదు

### పర్షియా ప్రధాన మంత్రి ముస్సాదిక్ ఉత్తరువు

టెహరాన్, సెప్టెంబరు 25: అబదాన్ రిఫైనరీలో ఇంకా మిగిలివున్న 300 మంది బ్రిటిష్ పనివారిని తొమ్మిది రోజులలో పర్షియానుండి బహిష్కరిస్తున్నట్లు ప్రధాన మంత్రి డాక్టర్ మహమ్మద్ మొసాదిక్ నేడు ప్రకటించారు.

ఇంతవరకు నిలిచిపోయివున్న నూనె పరిశ్రమను విదేశాల సహాయంతో తిరిగి ప్రారంభించడానికి ప్రయత్నాలు జరుగుతాయని ఇక్కడి అధికార వర్గాల వారు చెబుతున్నారు.

ఈ క్రింద సూచించిన కారణాల వల్ల బ్రిటిష్ పనివారి బహిష్కరణకు డాక్టర్ మొసాదిక్ ఉత్తర్వు చేసినట్లు ఆ వర్గాల వారు విశ్వసిస్తున్నారు:-

(1) బ్రిటిష్ పనివారు దాదాపు 50 కోట్ల పౌన్లు విలువ కలిగిన నూనె పరిశ్రమాగారాలు విధ్వంసం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. (2) బ్రిటిష్ పనివారు దేశంవిడిచి పోయినంత కాలం విదేశీయ సాంకేతిక నిపుణులు పర్షియాలో పనిచేయడానికి అంగీకరించరు (3) నూనె పరిశ్రమ సంపూర్ణంగా పర్షియా ఆధిపత్యం క్రింద లేనంతవరకు పర్షియా నుంచి నూనె కొనడానికి విదేశాలు అంగీకరించవు.

దక్షిణ పర్షియాలోని ఖుజిస్తాన్ రాష్ట్రంలో ఉన్న బ్రిటిష్ పనివారు దేశం విడిచి పోవడానికి అక్టోబరు 3 వ తేది రాత్రి 12 గంటలవరకు వ్యవధి ఇవ్వాలని డాక్టర్ మొసాదిక్ అక్కడి ప్రభుత్వాధికారులను ఆదేశించారు. ప్రధాని ఉత్తర్వులు వారికి రేపు అందచేయబడతాయని తెలుస్తున్నది. పర్షియా జాతీయ నూనె సంస్థలకు ప్రధాని ఉత్తర్వులు పంపడమైనది. బ్రిటన్‌తో రాయబారాలు సంపూర్ణంగా భగ్నమైనట్లైనని ప్రధాని డాక్టర్ మొసాదిక్ తలుస్తున్న కారణంగా బ్రిటిష్ పనివారికి దేశం విడిచిపోవడం కన్న గత్యంతరం లేదు.

### బ్రిటిష్ మంత్రివర్గ సమాలోచనలు

లండన్, సెప్టెంబరు 25: బ్రిటిష్ మంత్రివర్గం నేటి అపరాహ్ణం సమావేశమై అబదాన్‌లో బ్రిటిష్ పనివారిని బహిష్కరించడానికి పర్షియా తీసుకున్న నిర్ణయంపై చర్చించారు. ప్రధాని అట్లీ, పర్షియాతో రాయబారాలు జరిపిన మంత్రి రిఛర్డ్ స్టోక్సు ప్రస్తుత పరిస్థితి గురించి మంత్రివర్గానికి వివరంగా తెలియపరిచారు.

పర్షియా చర్యను సహించడమా, లేక ప్రతిఘటించడమా అన్నది ప్రభుత్వానికి విషమసమస్యగా పరిణమించినది. సరిగా ఎన్నికలకుముందు బ్రిటిష్ పనివారి బహిష్కరణను సహించడం బ్రిటిష్ ప్రజల సానుభూతి కోల్పోవడానికి కారణం కావచ్చు. కాని, పర్షియాకు సైన్యాలుపంపి పర్షియా చర్యను ప్రతిఘటించడం ప్రభుత్వానికి ఇష్టం లేదు. సోవియట్ యూనియన్ పరిసరాలలో ఉన్న దేశంలో అట్టిపని చేయడం ప్రమాదకరంగా పరిణమించవచ్చు. పైగా అట్టిచర్యను అమెరికా బలపరచక పోవచ్చునని అనుమానం కూడా బ్రిటన్‌కు ఉన్నది. ఏదైనా గురువారంనాటి మంత్రివర్గ సమావేశంలోగా బ్రిటిషు ప్రభుత్వం ఈ విషయంలో ఎట్టిచర్యలు జరుపక పోవచ్చు. గురువారంనాటి సమావేశంలో విదేశాంగమంత్రి హెర్బర్టు మారిసన్ కూడా పాల్గొంటారు.

సెప్టెంబరు 27 నుంచి 7 రోజులలోగా పర్షియా విడిచిపోవలసినదని సూచిస్తూ అబదాన్‌లోని బ్రిటిషు పనివారికి నోటీసులు అందచేయడమౌతుంది.

బ్రిటనుతో ఇక ఎట్టి రాయబారాలు జరుపబోవని సూచిస్తూ పర్షియా పార్లమెంటు నూనెసంఘం నివేదిక ప్రధానమంత్రి డాక్టర్ మొసాదిక్‌కు ... నివేదిక సమర్పించినట్లు ఓ... రానుండి వచ్చిన యురోక వార్తలో ఉన్నది.

### జనరల్ కరియప్ప

... సెప్టెంబరు 25: భారత ... జనరల్ కరియప్ప ... ప్రాంతి పరిశీలన నిమిత్తం ... వచ్చారు.

## హిందూ కోడ్‌బిల్లుపై చర్చకు వాయిదా

న్యూఢిల్లీ, సెప్టెంబరు 26: హిందూ కోడ్ బిల్లులోని తతిమ్మా క్లాజులపై చర్చను వాయిదా వేయడమైనదని ప్రధాన మంత్రి పండిత నెహ్రూ నేడు పార్లమెంటులో ప్రకటించారు.

## అల్పసంఖ్యాకరక్షణఒప్పందం అమలుకు ఆటంకాలు: నెహ్రూ ప్రకటన

### తూర్పు బెంగాల్‌లో హిందువుల దుస్థితి

న్యూఢిల్లీ సెప్టెంబర్ 26: "ఇండియా, పాకిస్థాన్‌ల మధ్య ఏర్పడిన వైరుద్ధ్య ఫలితంగా, అల్పసంఖ్యాక వర్గాల విషయమై చేసుకున్న ఒప్పందాన్ని అమలు పరచటానికి ఆటంకాలు ఏర్పడ్డవి." అని ప్రధాని పండిత నెహ్రూ నేడు పార్లమెంటులో ప్రకటించారు.

"దాని ఫలితాలలో కల్లా ముఖ్యమైనది ఇండియామీద పాకిస్థాన్ పత్రికలలోనూ, తదితర వర్గాల్లోనూ జరుగుతున్న అసత్య, వ్యతిరేక ప్రచారం. పాకిస్థాన్ నుంచి ఇండియాకు వస్తున్న కాందిశీకులను కస్టమ్సు అధికారులు మళ్ళీ హింసించటం జరుగుతున్నట్లు వార్తలు వస్తున్నవి. ఇంకా అనేక విధాలలో కూడా ఒప్పందం అమలు కాకుండా చేయబడుతున్నది." అని ప్రధాని వివరించారు.

తూ. బెంగాల్ నుంచి హిందువుల వలస జూన్ నెలనుంచి పెరిగిపోయినదనీ, ఇప్పటికీ అదిమామూలు సంఖ్యలకన్నా ఎక్కువగానే ఉన్నదనీ భారత విదేశాంగ సహాయమంత్రి కేస్కర్ నేడు పార్లమెంటులో ప్రకటించారు.

ఎ. సి. గుహాగారి ప్రశ్నకు లిఖిత పూర్వకంగా ఇచ్చిన జవాబులో ఆయన ఈక్రిందిఅంశాలను వివరించారు:

"హిందువుల ఇళ్లలో సొంతవార్లు కానీ, వారి బంధువులు ప్రతినిధులు కానీ ఉన్నప్పుడు కూడా వాటిని ప్రభుత్వం వశపరచుకుంటున్నది. ఇండియానుంచి తిరిగివెళ్లిన హిందూ కాందిశీకులకు మళ్లీ తమఇళ్లను సంపాదించటం చేతకాకుండా ఉన్నది. దేవాలయాలు మొదలైనవి అపవిత్రపరచబడుతున్నవి. అన్సార్లు, స్థానిక ఉద్యోగులు విచ్చలవిడిగా హిందువులను హింసిస్తున్నారు. వారి మొరలను అధికారులు ఉపేక్షిస్తున్నారు. హిందువులు శారీరకంగానూ, ఆర్థికంగానూ దౌర్జన్యాలకు గురి అవుతున్నారు.

ముస్లిం మతాన్ని, సంస్కృతినీ పొగిడేట్లుగా పుస్తకాలన్నిటిని తిరిగి వ్రాయించటం ప్రభుత్వ విధానం అయినట్లుగా ఉన్నది. అట్లా వ్రాయించినవి హిందువుల మనస్సులకు నొప్పి కలిగించేట్లుగా ఉంటున్నవి.

వ్యాపార సంస్థలు ముస్లిమేతరులకు ఉద్యోగాలు ఇవ్వరాదనీ, ఎక్కువ మంది ముస్లిమేతరులు ఉంటే తొలగించవలసినదనీ ఒత్తిడి చేయబడుతున్నది. హిందువులమీద ఆదాయపు పన్ను అమ్మకపు పన్నులు కావాలని ఎక్కువగా విధించటం, కొన్ని ప్రాంతాల హిందువులపైన 'రక్షణ' సుంకాలను విధించటం జరుగుతున్నది. ప్రభుత్వ శాఖల్లో అనుభవశాలు లయిన హిందూ ...

## ఆచార్య వినోబాభావే హెచ్చరిక

### వివాదాలన్నింట్నీ మధ్యవర్తి పరిష్కారానికి వదలివేయడమే వాంఛనీయమని సూచన

నర్సింగపూర్ (మ. ప్ర.), సెప్టెంబరు 25: "ఆంధ్ర రాష్ట్రం వీలయినంత త్వరలో ఏర్పడగలదని నేను ఆశిస్తున్నాను. మనం ఏమయినా చేయదలచుకుంటే, ఎంత త్వరలో దానిని పూర్తిచేస్తే అంత మంచిది." అని ఆచార్య వినోబా భావే నేడిక్కడ ప్రార్థనానంతర సమావేశంలో ప్రసంగిస్తూ, హెచ్చరించారు.

హృదయ పరివర్తనద్వారా భూమి పంపిణీ న్యాయంగా ఉండేట్లు చేయాలన్న ఉద్దేశంతో, కాలినడకన ఊరూరూ తిరుగుతూ ఆయన నేడిక్కడికి వచ్చారు.

"ఆంధ్రరాష్ట్ర స్థాపనకు బాబూ రాజేంద్రప్రసాద్, ప్రధాని నెహ్రూలు తమశక్తికొలదీ కృషిచేస్తున్నారన్న విశ్వాసం కలిగినమీదట నేను స్వామీ సీతారాంను ఉపవాసదీక్ష విరమించవలసినదిగా ఒప్పించాను.

"ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలని ఎన్నో సం॥ల నుంచీ ఆంధ్రులు కోరుతున్నారు. అది చాలా స్వల్ప విషయం. తమ రాష్ట్రవ్యవహారాలను తమ భాషలోనే జరుపుకోవాలని మాత్రమే ఆంధ్రులు కోరుతున్నారు. కొండా వెంకటప్పయ్యగారు ఆంధ్ర రాష్ట్రంకోసం కలవరిస్తూ ప్రాణాలు వదిలారు.

"ఆంధ్రరాష్ట్రం నిర్వివాద ప్రాంతాలతోనే ఏర్పడుతుంది. మిగిలిన ప్రాంతాల భవిష్యత్తును మధ్యవర్తుల పరిష్కారానికే వదిలివేయటం అవసరం. నిజానికి, భారతదేశంఅంతా ఒకటేఖండం. సరిహద్దుప్రాంతప్రజలు ఉభయభాషలనూ మాట్లాడతారు. కాబట్టి వివాదప్రాంతాలను గురించి ఎవ్వరూగూడా, అనవసర మయిన పట్టుదలను ప్రదర్శించకూడదు" అని భావే అన్నారు.

ఈ పర్యటనలో ఇప్పటికి 4053 ఎకరాలభూమిని, భూమి లేని వారికి పంచిపెట్టడం కోసం, భూస్వాముల దగ్గర దానంగా స్వీకరించారు.

### కళా వెంకట్రావుగారి ప్రకటన

మదరాసు, సెప్టెంబరు 25: "తమిళనాడు కాంగ్రెసుగాని, కర్నాటక ప్రదేశ్ కాంగ్రెసుగాని, మదరాసు ప్రభుత్వంగాని నాయకత్రయ నివేదిక ప్రాతిపదికగా ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని ప్రతిఘటించరనుకుంటున్నా"నని శ్రీ కళా వెంకటరావుగారు అన్నారు.

శ్రీ వెంకటరావుగారు తెనాలినుండి ఎక్స్‌ప్రెస్‌లో నేటి సాయంత్రం మదరాసు వచ్చారు. సెంట్రల్ స్టేషన్ వద్ద జిల్లా కాంగ్రెసు కార్యదర్శి, పలువురు మిత్రులు స్వాగత మిచ్చారు. రావుగారు అక్కడనుండి సరాసరి ప్రభుత్వ అతిథి గృహానికి వెళ్లారు.

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం విషయమై వెంకట రావుగారింకా ఇట్లా తెలిపారు:-

రాష్ట్ర నిర్మాణం జనరల్ ఎన్నికలలోపల సాధ్యం కాదు. మనం ఒక రాజ్యాంగం వ్రాసుకున్నాం. రాష్ట్ర విభజనకు దానినను సరించి జరుగవలసిన తంతు అంతా జరగక తప్పదు. అయితే

(2-వ పేజీ చూడుడు)



## ఆరోగ్యశాఖా మంత్రిగా శ్రీ కళా వెంకట్రావుగారి ప్రమాణస్వీకారం

మద్రాసు, సెప్టెంబరు 26: కళా వెంకట్రావుగారు ఇవాళ 11 గంటల 10 నిముషాలకు మంత్రివర్గ మందిరంలో మద్రాసుప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రిగా ప్రమాణం స్వీకరించారు. మద్రాసు గవర్నరు శ్రీ కృష్ణసింగ్ జీ భావసింగ్ జీ గారు వారిచే ప్రమాణం చేయించారు. వెంకట్రావుగారికి ఆరోగ్య శాఖతోడు 'మద్యనిషేధం, గృహనిర్మాణం, అడవులు, రీ సెటిల్మెంట్ శాఖలు ఇవ్వబడినవి. కౌన్సిలులో ఖాళీగావున్న స్థానానికి వారు నామినేటు చేయబడతారు. ఢిల్లీపార్లమెంటులో వారి సభ్యత్వానికి రాజీనామా యిస్తూ నేను స్పీకరుకు జాబు వ్రాశారు.

ప్రమాణం చేయించిన వెంటనే గవర్నరుగారు కళా వెంకట్రావుగారిని అభినందిస్తూ, ఇట్లా అన్నారు:-

"మళ్లీ మా మంత్రివర్గంలోకి మీరు వచ్చినందుకు ఎంతో సంతోషిస్తూ మిమ్మల్ని అభినందిస్తున్నాను. నిన్న రాత్రి ముఖ్యమంత్రి ఇవాళే మీ ప్రమాణస్వీకరణ అని చెప్పినప్పుడు చాలా సంతోషించాను. మీతోపాటు వర్షాన్ని వానను కూడా తీసుకురావడం శుభసూచకంగా ఉంది.

మీ అనుభవమంతా ఈరాష్ట్రానికి, ప్రజకు ఉపయోగపడగలదని ఆశిస్తున్నాను."

గవర్నరుగారు వెంకట్రావుగారిని కరస్పర్శ చేసి, సభవారివద్ద సెలవు తీసుకొని వెళ్ళిపోయారు. తర్వాత ముఖ్యమంత్రిసహా మంత్రులంతా వెంకట్రావు గారిని అభినందించి మళ్ళీ తమతో వారు కలిసినందుకు తమ ఆనందాన్ని వెల్లడించారు. భక్తవత్సలం, సీతారామరెడ్డి, ఎ. బి. షెట్టి, పరమేశ్వరన్ గారలు వెంకట్రావుగారి వెంట, డా॥ రాజన్ గారు వెనక కూర్చొనే గదిలో మంత్రి ఆసనంలో ప్రవేశపెట్టారు.

శ్రీయుతులు శేషాచారి, వెంకట్రావు నాయుడు, రాజారెడ్డి గారలు వెంకట్రావుగారిని పుష్పమాలాలంకృతులుగావించారు. వెంకట్రావుగారు ముఖ్యమంత్రి గదికివెళ్లి దర్శించి వచ్చారు.

తరువాత అధికారులు, అనధికారులు ఒకరి తర్వాత ఒకరు వెంకట్రావు గారిని అభినందించి వెళ్లారు.

ఆరోగ్యశాఖా కార్యదర్శి శ్రీ కైవార్, డైరక్టర్ ఆఫ్ మెడికల్ సర్వీసెస్ డాక్టరు వాసుదేవరావు డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ హెల్తు డా॥ విశ్వనాథన్ గారలు వెంకట్రావు గారిని దర్శించారు.

వెంకట్రావుగారు ఎల్లామ్స్ రోడ్డులో సీతారామ రెడ్డిగారు ఉండే ఇంట్లో ప్రవేశిస్తున్నారు. సీతారామ రెడ్డిగారు వెనక డా॥ రాజన్ గారు అడయారులో ఉండే 'తిరువరంగం' గృహానికి నేడు మారుతున్నారు.

### ప్రజకు సందేశం

మద్రాసు మంత్రి పదవి స్వీకరించిన తర్వాత ఆంధ్ర ప్రజకు ఈ సందేశాన్ని వెంకట్రావుగారు అందజేస్తున్నారు:-

"తిరిగి మదరాసు మంత్రి వర్గమునకు యీ తరుణములో పన్నాకర్షించినది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమయములో నాకు సేవా ఫలితము దక్కునని ఆశయ."

## వరుణునిసంతృప్తి పరచడానికి ఆమరణనిరశనవ్రతము

ఇండూరు, సెప్టెంబరు 25: ఇక్కడికి 50 మైళ్ల దూరమున వున్న ఖర్గాన్ నగరంలో కల్లు సాము సేర్వే హరినారాయణ్ గారు వరుణ దేవుని సంతృప్తిపరచి, వానను భూమిపైకి ఆకర్షించడానికి ఆమరణ నిరశన వ్రతంపూనివున్నారు. అనావృష్టివల్ల ఆ ప్రాంత ప్రజలు పడుచున్న బాధలను సహించలేక హరినారాయణ్ గారు రైల్వేస్టేషనుకు ఎదురుగా వున్న దేవళములో ఒక వారం క్రిందట నిరశనదీక్ష ప్రారంభించినట్లు నేడు ఇక్కడికి వార్త వచ్చింది.

### ఒంగోలులో పూజలు

ఒంగోలు, సెప్టెంబరు 25: ఇక్కడ కొన్ని నెలలుగా వానలు లేవు. బావులలో పూడా దాయింకి పోయింది

ఈ పరిస్థితులలో పౌరులు కొందరు నిన్న రంగారావు చెరువు కట్టమీద సహస్ర ఘటాభిషేకము, సమారాధనా జరిపారు. సమారాధన పూర్తిఅయిన వెంటనే, ఇక్కడ వాన జల్లు పడది. పరిసర ప్రాంతాలలో బాగా వర్షించింది. (స్వ. వి.)

## కాంగ్రెస్‌లో చేరిక: కిద్వాయ్ ప్రకటన

కాశీ, సెప్టెంబరు 25: "కాంగ్రెసులో నేను మళ్లీ చేరిపోవడానికి యిక అభ్యంతరం ఏమీలేదు. కాంగ్రెసు కార్యవర్గం పునర్నిర్మాణమై, వెనుకటి కార్యదర్శులు ఇద్దరు తొలగించబడడంతో, అందుకుగల అవరోధాలు సమస్తం తీరిపోయినట్లయింది" అని మాజీ కేంద్ర తపాలాశాఖా మంత్రి రఫీ అహ్మద్ కిద్వాయ్‌గారు నేటిసాయంత్రం యిక్కడ పత్రికా ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తు ఉద్ఘాటించారు.

"అయితే ఈ విషయమై నా అంతిమ నిర్ణయాన్ని కలకత్తాలో సెప్టెంబరు 28 వ తేదీన జరిగే కె. ఎమ్. పి పార్టీ కార్యవర్గ సమావేశం తర్వాతగాని ప్రకటించను. కె. ఎమ్. పి పార్టీలోని నా మిత్రులతో సలహా చేయవలసివుంది; అయితే, అంతమాత్రంతో వారి సలహాకు నేను బద్ధుడైవుంటానని అనుకోను" అని కిద్వాయ్ గారు స్పష్టీకరించారు.

### డా॥ పి. సి. ఘోష్‌కుఆహ్వానం

కలకత్తా, సెప్టెంబరు 25: పశ్చిమ బెంగాలులోని కృషిక్ మజ్దూర్ పార్టీ సభ్యులు కాంగ్రెసులో పునఃప్రవేశించడానికి గల అవకాశాల గురించి తనతో ముఖాముఖిగా సంప్రతింపులు జరపడంకోసం ఒకసారి ఢిల్లీ రావలసిందని పండిట్ నెహ్రూ డా॥ పి. సి. ఘోష్‌కు ఆహ్వానం పంపినట్లు తెలుస్తున్నది.




## కొరియా రాయబారాలు: లెయిజాన్ అధికారుల సమావేశంలో కమ్యూనిస్టుల ప్రతిపాదన

టోకియో, సెప్టెంబరు 26: సమితి లెయిజాన్ అధికారులు, కమ్యూనిస్టు లెయిజాన్ అధికారులు నేడు తిరిగి కేసాంగ ప్రాంతంలో సమావేశమయినారు. ఉభయపక్షాల లెయిజాన్ అధికారులు నిన్న జరిపిన సంభాషణలలో ప్రతిష్టంభన ఏర్పడినది. ఆప్రతిష్టంభనను తొలగించేనిమిత్తం జనరల్ రిడ్జివే నిన్న చేసిన ప్రయత్నం సఫలమైనది.

నిన్నటి సమావేశం నుండి కమ్యూనిస్టు ప్రతినిధులు వైదొలగి నప్పటికీ నేడు తిరిగి సమావేశం జరపడానికి తాను అంగీకరిస్తున్నట్లు రిడ్జివే కమ్యూనిష్టులకు తెలియపరిచారు. నేటి సమావేశం ప్రారంభం కావడానికి ముందు కమ్యూనిస్టులు రిడ్జివే సందేశానికి తమ సమాధానం అందచేశారు.

మంగళవారంనాడు జరిగిన విమాన యుద్ధంలో 73 అమెరికన్ సేబర్ జెట్ విమానాలు కొంతసేపు దాదాపు 100 మిగ్ రకం కమ్యూనిస్టు విమానాలతో పోరాడినవి. అయిదు కమ్యూనిస్టు విమానాలు ధ్వంసమయినవనీ, మరి అయిదింటికి దెబ్బలు తగిలినవని తెలుస్తున్నది. కమ్యూనిస్టులు అయిదు సమితి విమానాలను కూల్చినట్లు పైయాంగు రేడియో ప్రకటించినది.

ఒకరోజంతా తీవ్రంగా పోరాడిన తరువాత సమితిబలాలు నేటి ఉదయం యాంగూకు పశ్చిమంగా ఉన్న కర్వతాలను వశపరచుకున్నవని అష్టమ సయిన్యం ప్రకటించినది.

నిన్నటి సమావేశంలో లెయిజాన్ అధికారుల చర్చలవల్ల ప్రయోజన మేమీ లేదనీ, ఉభయపక్షాల ప్రతినిధులు సమావేశమై కొరియా యుద్ధవిరమణపై చర్చ ప్రారంభించాలనీ కమ్యూనిస్టు లెయిజాన్ అధికారి కర్నల్ చాంగ్ చున్సాన్ పెకింగు రేడియో ప్రకటించినది. ఆప్రతిపాదనను సమితి అధికారి కర్నల్ కిన్నే అంగీకరించారని, తమ ఉన్నతాధికారుల ఆదేశాలు ... ఉభయపక్షాల వారు ఒప్పుకున్నారని ఆ ప్రకటనలో ఉన్నది.

# నిష్పాక్షికంగా వ్యవహరించండి

## ఎన్నికల్లో ప్రభుత్వోద్యోగుల కర్తవ్యంపై ముఖ్యమంత్రి ఉద్బోధ

మద్రాసు, సెప్టెంబరు 24:— "రానున్న ఎన్నికలలో ప్రభుత్వోద్యోగులైన మీరంతా కూడా నిష్పక్షికంగా విధులను నెరవేర్చి, గవర్నరు గారు శాసన సభవారికిచ్చిన వాగ్దానాన్ని పాలించవలసి వున్నది. మీయొక్క ఓటును మీ చిత్తానుసారం వినియోగించుకోవచ్చు. కానీ ఎన్నికల అధికారులు మీకు యిచ్చినటువంటి పనులను మీరు అప్రమత్తతతో పూర్తిగా నెరవేర్చవలసి వుంటుంది." అని మద్రాసు ముఖ్యమంత్రి కుమారస్వామి రాజా గారు మద్రాసు ప్రభుత్వ ఉద్యోగులందరకూ రానున్న ఎన్నికల సందర్భాన ఒక సందేశాన్ని జారీచేశారు. వారి సందేశం యీ విధంగా వున్నది:

"స్వతంత్ర భారత శాసనసభల ప్రథమ ఎన్నికలు త్వరలో జరుగనున్నాయని మీకు తెలుసు. 1952 జనవరిలో పోలింగు జరుగుతుంది. కానీ యీలోపున అందుకు తగిన బ్రహ్మాండమైన సన్నాహాలు చేయవలసివుంది. ప్రజాస్వామ్య యుతమైన మన రాజ్యాంగ నిర్వహణను మనము తిరుదమా, లేదా అన్నదానికి యీ ఎన్నికలే పెద్ద పరీక్ష. ఉద్యోగస్థులు సమర్థతతో నిష్పాక్షికంగా వ్యవహరించినట్లయితే ప్రజలూ, రాజకీయపక్షాలు కూడా వారికి సంపూర్ణ సహకారాన్ని యిస్తారు. సమర్థతతో యీ బ్రహ్మాండమైన ఎన్నికలను నిర్వహించవలసిన భారం మీపై వున్నది. రిటర్నింగ్ ఆఫీసరు కానివ్వండి—ఎన్నిక జరిపించే అధికారి కానివ్వండి—పోలింగ్ వుద్యోగి కానివ్వండి-బంట్రోతు కానివ్వండి-తమ విధిని జయప్రదంగా నిర్వహించటానికి, నూటికి నూరుపాళ్లు సమర్థతను ప్రదర్శించాలి. ఇప్పుడు మీ సామర్థ్యానికీ, శీలానికీ, యింతకాలంగా మీరు సంపాదించిన ప్రతిష్ఠ అగ్నిపరీక్ష వచ్చిందన్న మాట. ఇందులో మీరు బయటపడగలిగితే, మీ కేగాక, మీరువున్న రాష్ట్రానికి, యావద్భారతానికి, పేరుప్రతిష్ఠలను యితోధికంగా సంపాదించినవారు అవుతారు. ఎన్నికలకు సంబంధించిన నిబంధనలన్నిటినీ మీరు జాగ్రత్తగా అనుసరించాలి. మీరు ఆ నిబంధనలన్నీ పరిశీలించాలి. మీకు యిచ్చే శిక్షణ తరగతులలోని పాఠాలను జాగ్రతగా గమనించి, మీకు యిచ్చిన పనులలో అక్రమాలు ఏవీ లేకుండా చూడాలి. అధికారి అయినటువంటి వాడు, తాను ఉత్తమాధికారిగా వర్తించి, తన విధులను చక్కగా నిర్వహించ గలిగినప్పుడే, తనక్రింద వుద్యోగుల చేత కూడా పని చక్కగా చేయించ కలుగుతాడు. ఈనాటినుంచి ఎన్నికలు అయిపోయేటంత వరకూ, ఎన్నికలకు సంబంధించిన వ్యవహారాలన్నిటినీ అతి జరూరుగా గమనించి ఏ ఘట్టంలోనూ ఆలస్యం లేకుండా చూడటం మీ ప్రధాన కర్తవ్యం. ఈ ఎన్నికలలో సమర్థతతో నిర్వహించిన వారికి వారి ప్రామోషనుకు బాగా తోడ్పడుతుంది. వారి ప్రవర్తనకు సంబంధించిన రికార్డులలో మంచి కితాబ్ సంపాయిస్తారు. అసమర్థతే, అలక్ష్యమూ చూపినట్లయితే, శిక్షణ చర్యకు పాత్రులౌతారు. ఈ ఎన్నికలలో అన్ని తరహాల వుద్యోగులూ కూడా సమయానికి తగిన ప్రాజ్ఞతను నిర్వహణశక్తిని ప్రదర్శించి రాష్ట్రం యొక్క మంచిపేరు నిలబెట్టుతారనీ యీ అగ్నిపరీక్షనుంచి కీర్తిప్రతిష్ఠలతో బయటకు రాగలరనీ ఆశిస్తున్నాను."

## ప్రభుత్వోద్యోగులకు ఖేర్ హెచ్చరిక

బొంబాయి, సెప్టెంబరు 25: రాబోయే ఎన్నికలలో ఉద్యోగులు తమ నిష్పక్షిక నిర్వహణలో ఎట్టి పక్షపాతాన్ని గాని ప్రదర్శించ కూడదని హెచ్చరిస్తూ, బొంబాయి ప్రధాన మంత్రి బి. జి. ఖేర్ ప్రభుత్వోద్యోగులకు ఈ వేళ ఒక సందేశం జారీ చేశారు.

## బొంబాయి కేంద్ర నియోజకవర్గం

### మూడు ప్రముఖ రాజకీయ పక్షాలకు పోటీ

బొంబాయి నగరంలో అత్యంత ప్రధానమైన బొంబాయి కేంద్ర నియోజకవర్గంనుండి పార్లమెంటుకు మూడు రాజకీయపక్షాల అభ్యర్థులు పోటీ చేస్తున్నారు. భారత సోషలిస్టుపార్టీ కార్యదర్శి శ్రీ అశోక మెహతా, కాంగ్రెసు కార్మికనాయకుడు అబీద్ అలీ జాఫర్ భాయ్, కమ్యూనిస్టునాయకుడు శ్రీ ఎస్. ఎ. డాంగే ఈ నియోజకవర్గంనుండి పోటీ చేయనున్నారు. ఈ నియోజకవర్గంలో 7 లక్షలమంది ఓటర్లు ఉన్నారు. వారిలో మలబార్ హిల్‌లో నివసించే ధనికవర్గంవారు, దాదర్, గిర్గాంలలోని మధ్యతరగతి ప్రజలు, ఓర్లి, నారీలలోని కార్మిక వర్గంవారు ఉన్నారు. వారిలో ఒక లక్షమంది క్రిస్టియన్, ముస్లిమ్ ఓటర్లు ఉన్నారు.

బొంబాయి దక్షిణ నియోజకవర్గం నుండి సోషలిస్టు నాయకుడు శ్రీ ప్రసు పోత్తిమ్ త్రికమ్‌దాస్ పార్లమెంటుకు పోటీచేస్తారు. ఆయనతో బొంబాయి ప్రదేశ్ కాంగ్రెసు సంఘాధ్యక్షుడు శ్రీ ఎస్. కె. పాటిల్ పోటీ చేయవచ్చు.

బొంబాయి శివారు నియోజకవర్గం నుండి పార్లమెంటుకు సోషలిస్టు నాయకురాలు శ్రీమతి కమలాదేవి ఛట్టోపాధ్యాయ పోటీ చేస్తారు.

### రాజకీయ సమావేశాలపై ఆంక్ష

ఎన్నికలకు 24 గంటలు ముందుగా ఎట్టి రాజకీయ సమావేశాలు కాని, ఊరేగింపులు కాని జరగకూడదని బొంబాయి ప్రభుత్వం నిషేధించనున్నది. పోలింగు కేంద్రాలకు ఓటర్లను తీసుకొని రావడానికిగాను అభ్యర్థులు మోటార్ బండ్లను, ఇతరబండ్లను వుపయోగించకూడదని కూడా ప్రభుత్వం నిషేధిస్తుందని బొంబాయి హోంశాఖామంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ ఈరోజున పత్రికా విలేఖరులతో చెప్పారు. బుల్సార్ నియోజకవర్గంనుండి రాష్ట్ర శాసనసభకు పోటీచేయనున్నట్లు ఆయన ప్రకటించారు.

## సోషలిస్టు పార్టీ పార్లమెంటరీ బోర్డు

సెప్టెంబరు 29, 30 తేదులలో జరుగవలసివున్న సోషలిస్టుపార్టీ పార్లమెంటరీ బోర్డు సమావేశం అక్టోబరు 1, 2 తేదులలో బొంబాయిలో జరపడానికి నిశ్చయించినట్లు నేటి సాయంకాలం ఇక్కడ అధికారరీత్యా ప్రకటించారు.

# పంజాబ్‌లో కాంగ్రెసు అభ్యర్థుల ఎన్నిక

## 500 కు పైగా దరఖాస్తులు

జలంధర్, సెప్టెంబరు 24: పంజాబ్ శాసనసభకు, పంజాబ్ నుండి పార్లమెంటుకు కాంగ్రెసు అభ్యర్థులుగా పోటీ చేయడానికి 500 మందికి పైగా పంజాబ్ ప్రదేశ్ కాంగ్రెసు ఎన్నికల సంఘానికి దరఖాస్తులు పెట్టుకున్నారు. పంజాబ్ మాజీ ప్రముఖ మంత్రి డాక్టర్ గోపీచంద్ భార్గవా, ఆయనతోడి మాజీ మంత్రులలో సర్దార్ గుర్ బచన్ సింగ్ బాజ్వా తప్ప తతిమ్మావారెవరు దరఖాస్తులు పెట్టుకోలేదు. ఈ దరఖాస్తులను జిల్లా కాంగ్రెసు సంఘాల సూచనలకై పంపడమైనది. ఆ సంఘాలు వాటిని సెప్టెంబరు 28 లోగా ప్రదేశ్ కాంగ్రెసు ఎన్నికల సంఘానికి తిరిగి పంపాలి. అక్టోబరు 5 వ తేదీలోగా వాటిని కాంగ్రెసు కేంద్ర ఎన్నికల సంఘానికి పంపడం జరుగుతుంది.

### హిమాచల్ ప్రదేశ్

పంగి నియోజకవర్గంనుండి హిమాచల ప్రదేశ్ రాష్ట్ర శాసనసభకు మూడు పక్షాల అభ్యర్థులు పోటీ చేయనున్నారు. వారిలో కాంగ్రెసు అభ్యర్థి శ్రీ దౌలత్ రామ్, ఎమ్. ఎమ్. పి. అభ్యర్థి శ్రీ మహాజనరాయ్, స్వతంత్ర అభ్యర్థి శ్రీ నారాయణ సంగు ఉన్నారు.

## కాంగ్రెస్ అభ్యర్థిత్వం

### గుంటూరు ఉభయజిల్లాలనుండి దరఖాస్తులు

విజయవాడ, సెప్టెంబరు 25: గుంటూరు ఉభయ గోదావరి జిల్లాలనుంచి రాష్ట్ర శాసన సభలకు కాంగ్రెసు అభ్యర్థులుగా పోటీ చేయదలచి యీ దిగువవారు ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసు సంఘానికి దరఖాస్తులు పెట్టుకొన్నారు.

గుంటూరు:—వినుకొండ: శ్రీ జి. అనంతరామ కోటయ్య.

పల్నాడు: శ్రీయుతులు బి. ఎ. నారాయణరావు, ఉల్లి సరస్వతిమ్మ, కె. బ్రహ్మానందరెడ్డి, యస్. ఆంజనేయులురెడ్డి.

బెల్లంకొండ:—శ్రీయుతులు యస్. ఆంజనేయులురెడ్డి, వి. శరభయ్య, వై. నాగిరెడ్డి. బి. ఆదినారాయణరావు.

నర్సరావుపేట: శ్రీయుతులు కె. వేణుగోపాలరెడ్డి, కె. బ్రహ్మానందరెడ్డి.

చిలకలూరిపేట: శ్రీయుతులు బొల్లినేని నాగయ్య, కొసరాజు సుబ్బారావు, డి. కోటేశ్వరరావు.

సత్తెనపల్లి: శ్రీయుతులు ఆరె వీరారెడ్డి, సి.హెచ్. శ్రీరామ రెడ్డి, టి. సాధువమ్మ, బి. సత్యనారాయణ రెడ్డి, బి. వందనం, యం. రాయప్పరెడ్డి, కె. వెంకటరెడ్డి, కె. చిన్నయ్యరెడ్డి, ఎ. అరుణరావు.

మంగళగిరి: శ్రీయుతులు పి. ఆర్. రామానుజాచార్యులు, కె. వెంకటరత్నం, టి. నాగేశ్వరరావు, పి. ప్రకాశరావు, కె. వెంకటసుబ్బయ్య, మేకా కోటిరెడ్డి, జి. వెంకటప్పయ్య, పి. రామకోటయ్య, యన్. వెంకటరామారావు.

గుంటూరు: శ్రీయుతులు తిన్నెరు పున్నయ్య, జి. రత్నమ్మ, ఎ. కామేశ్వరరావు, యం. నాగేశ్వరరావు, యం. ఎ. సలాం, చంద్రమౌళి సత్యవతిమ్మ.

పత్తిపాడు: డి. వెంకటసుబ్బమ్మ, చేబ్రోలు రామస్వామి, జి. బాపయ్య, పి. కోటమ్మ.

దుగ్గిరాల: శ్రీయుతులు యం. సురవారెడ్డి, పి. శ్రీరాములు, అవుటూరు రామిరెడ్డి, వి. సత్యనారాయణ.

తెనాలి: శ్రీయుతులు బి. కనకసుందర శర్మ, ఆలపాటి వెంకట్రామయ్య.

అమృతలూరు: శ్రీ వి. సీతారామయ్య.

రేపల్లె: శ్రీయుతులు కూచిభొట్ల రామకృష్ణయ్య, యం. వి. రంగారావు, యన్. యస్. ఆర్. కృష్ణా, ఎ. రంగారావు, కె. పుండరీకాక్షయ్య, కె. చంద్రమౌళి.

బాపట్ల: యల్. బి. మనోహరరావు, యం. పి. హుస్సేన్, యం. వెంకట్రామా.

పొన్నూరు: శ్రీయుతులు దాసరి వెంకటసుబ్బారావు, జి. యల్. జేనియల్, ఆర్. నారాయణ.

చీరాల: శ్రీయుతులు ఆర్. హరిప్రసాదరావు, జి. కోటయ్య, యన్. జోసెఫ్, యస్. బెంజిమిన్, వి. రామయ్యశ్రేష్ఠి, బి. కోటిరెడ్డి, సి హెచ్. రామమూర్తి.

ఒంగోలు: శ్రీయుతులు ధారా గోపాలశాస్త్రి, పెద్దిభొట్ల రామచంద్రరావు, కె. బెంజిమిన్, బి. వెంకటప్పయ్య. యస్. విజయరామరాజు, పి. బుచ్చి అప్పానాయుడు ఒంగోలు (షెడ్యూల్డు) శ్రీయుతులు ఎ. బలమూదాసు, పుట్టా సుబ్బయ్య, టి. జియ్యరదాసు, వి. రామనరసయ్య, కె. సుబ్బారావు, యన్. సాంబశివరావు, కె. ప్రార్థయ్య, డి. సుందరమ్మ, కె. హనుమయ్య.

పశ్చిమగోదావరి: చింతలపూడి: శ్రీయుతులు కె. ఆర్. యస్. ప్రకాశరావు, యం. బాపినీడు:

ఏలూరు: శ్రీయుతులు యం. రంగయ్య, కె. నీలకంఠేశ్వరమ్మ, సి. అమ్మన్నరాజ.

తాడేపల్లిగూడెం: శ్రీయుతులు యస్. బ్రహ్మయ్య, పి. సత్యనారాయణరావు, తిల్లాప్రగడ నరసింహశర్మ, సి. యస్. ఆర్. సి. వి. పి. మూర్తిరాజు.

అలంపురం: శ్రీయుతులు దుమ్మలపల్లి వీరభద్రరావు, దుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి, డా॥ యస్. ఆర్. అత్తిలి, ఆత్మకూరి గోవిందాచారి, యస్. రామమూర్తి

ఉండి: శ్రీయుతులు యం. సత్యనారాయణరాజు, డి. నారాయణరాజు, జి. భారతి.

భీమవరం: శ్రీయుతులు జక్కంశెట్టి ఆదినారాయణమూర్తి, కె. నరసరాజు, సాగి నారాయణరాజు, డి. లక్ష్మీకాయమ్మ.

నర్సాపురం: శ్రీయుతులు అల్లూరి సత్యనారాయణరాజు, భూపతిరాజు బాపిరాజు.

నర్సాపురం: (షెడ్యూల్డు) శ్రీయుతులు బి. వెంకటరెడ్డి, వడాలి సూర్యనారాయణ, టి. శ్యాంబాబు, యం. నరసింహం, యన్. సాంబశివరావు, జి. వీరాస్వామి, డి. పెరుమాళ్లు.

తణుకు: శ్రీయుతులు జంధ్యాల ప్రకాశరావు, చిట్టూరి సుబ్బారావు, ముదిగంటి జగన్నశాస్త్రి.

పెనుగొండ: శ్రీయుతులు యన్. తిరుపతిరాజు, చేలిరెడ్డి గోవిందరెడ్డి, వి. బాపిరెడ్డి, టి. రామసోమయాజి.

కొవ్వూరు: ఎం. ఎ. ఖాన్, ఎ. బాపినీడు, చేబియ్యం సోదెమ్మ, కె. కృష్ణరావు కొవ్వూరు (షెడ్యూల్డు) శ్రీయుతులు కలపర్తి ఆదెయ్య, నక్కా పెదవెంకయ్య, నక్కా చినవెంకయ్య, ఆర్. ఏసుపాదం, యం. రాజేశ్వరరావు, దేవిరెడ్డి భీమయ్య, వి. శిఖామణి, పి. నాగేశ్వరరావు.

తూర్పుగోదావరి. భద్రాచలం: శ్రీయుతులు మోటమర్రి సోమసుందరం, వరహరిశెట్టి శివిప్రసాదరావు, దాసరి సత్యనారాయణ, వత్సవాయ తిరుపతిరాజు, అత్తిలి సూర్యనారాయణరాజు, కోటగిరి కొండలరావు.

(షేడ్యూలు) శ్రీయుతులు శరసంబొజ్జదొర, చోడి మల్లిఖార్జున.

తుని: యస్. ఆర్ వి. వి. కృష్ణంరావు, పి. గుర్రాజు.

పిఠాపురం: శ్రీయుతులు రావు అచ్చయ్యారావు, అల్లుమల్లు చక్రపాణి, మాదేపల్లి తిమ్మయ్య, కె. రాజలింగేశ్వరరావు,

పెద్దాపురం: శ్రీయుతులు తోట రామస్వామి కె. తిమ్మయ్య.

బూర్గుంపాడు: శ్రీయుతులు వి. సత్యనారాయణమూర్తి, యం. వరసన్న.

రాజమండ్రి: శ్రీయుతులు వి. ఏప్. కోటేశ్వరరావు, కె. శ్రీమన్నారాయణ, జిడ్డు సుబ్బారావు, యస్. వి. రామరావు.

కాకినాడ: శ్రీయుతులు కె. దయానందరాజు, పైడా వెంకటనారాయణ, సి. సుందరేశ్వరరావు (షెడ్యూల్డు) శ్రీయుతులు పాము రామమూర్తి, జి. కామయ్య.

రామచంద్రపురం: శ్రీయుతులు ఎం. పళ్లంరాజు, బి. వెంకటరత్నం.

అనపర్తి: శ్రీయుతులు పులగం పత్తిరెడ్డి, పత్తి పత్తిరాజు, గణగూరి వెంకటరెడ్డి, వుల్లాడి రామిరెడ్డి, పి. సత్యనారాయణరెడ్డి, ఎ. సుబ్బారాయుడు.

పామర్రు: శ్రీయుతులు యస్. బి. పి. పట్టాభిరామరావు, చోడే రంగారావు, కొవ్వూరి పట్టాభిరామయ్య, ఉండవల్లి సత్యనారాయణమూర్తి.

అమలాపురం: శ్రీయుతులు నాగంటి అచ్యుతలింగం, ఎ. జోగయ్య, వి. జగ్గరాజు, ఆర్. రామచంద్రరావు, జి. నరసింహమూర్తి (షెడ్యూల్డు) శ్రీయుతులు కొల్లు తాతయ్య, గంగిశెట్టి చికిటె.

రాజోలు: శ్రీయుతులు ముప్పర్తి వెంకటరత్నం, బిక్కిని బుచ్చిరాజు, పెన్మత్స సత్యనారాయణరాజు, ఆర్. రామలింగరాజు, బి. విశ్వనాథం, ఎస్. బ్రహ్మకవిశాస్త్రి, ఎస్. వెంకటస్వామి, (షెడ్యూల్డు) బోయి భీమన్న ఉండ్రు గోపాలరావు.

# తమిళనాడులో కాంగ్రెసు విజయం తథ్యం

మద్రాసు, సెప్టెంబరు 24: 'సరియైన అభ్యర్థులను పెడితే తమిళనాడులో 100 కి 90 స్థానాలు కాంగ్రెసు జయిస్తుంది.' అని మద్రాసు ప్రభుత్వ పరిశ్రమల మంత్రి పెరుమాళ్ స్వామిరెడ్డి గారు నేడు పత్రికా ప్రతినిధులసభలో చెప్పారు. ఇప్పుడు ఉండే శాసనసభ్యులు కొందరిపై ఆరోపణలు చేసేవారు చేశారనీ, వాటి సత్యాసత్యాలను ఎన్నికల సంఘంవారు తెలుసుకో గలరని అన్నారు. రాజా ముత్తయ్య చెట్టిగారూ, మేయరు రామనాథన్ చెట్టియారు వాణిజ్య వేత్తలు కాంగ్రెసు అభ్యర్థిత్వానికి దరఖాస్తులు పేస్తున్నారంటే కాంగ్రెసుబలం వెల్లడౌతోందన్నారు. వైద్యనాథ అయ్యరు గారు దరఖాస్తు వెయ్యలేదని మధుర పట్టణం ఉత్తరస్థానానికి వారిని పెట్టవలసిందని ఎన్నికల సంఘానికి సూచింపబడిందనీ చెప్పారు.

## సేలంలో మంత్రి భక్తవత్సలం ప్రచారము

సేలమ్, సెప్టెంబరు 25: వోటర్లు అప్రమత్తులుగావుండి అర్హులైన వారిని శాసనసభకు ఎన్నుకోవాలి. ఈ నాల్గు సంవత్సరాలనుండి కాంగ్రెసు ప్రభుత్వము ప్రజలకు ప్రశస్తమైన సేవచేసినది. కనుక వచ్చే జనరల్ ఎన్నికలలో ప్రజలు కాంగ్రెసు అభ్యర్థులను ఎన్నుకోవాలి' అని మద్రాసు మంత్రి శ్రీ భక్తవత్సలంగారు నిన్న యిచ్చట బహిరంగసభలో ఉపన్యసిస్తూ ఉద్బోధించారు.

మంత్రి ప్రసంగించబోతూవుండగా ద్రావిడకజగమ్ సభ్యులు కొందరు నల్ల జండాలు విసిరారు.

# మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 26

బంగారు-వెండి నేటిమధ్యాహ్నం 1 గంటకు పవరసు 1-కి ఎల్వప్పతొమ్మ పేల్యూటాక్సుతోసహా రు. 77-6-0 పెట్టబంగారు తులం 111-14-0 మూన బంగారు 109-0-0 సీమవెండి తులం 100-8 (శెడి) 190-0-0 వెండి తులం 1-5 1-15-0.

వేరుశనగ: (531 పౌ 1-కి ఎక్సుకోపు గిడ్డంగులు మెషీన్ -పేల్యూటాక్సుతో సహా)

| | |
|---|---|
| వరాని | రు. 182 183 |
| కడిరి | రు. 185 |

వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ బిలో 3%

| | |
|---|---|
| నామినల్ (500 పౌ.) | రు. 357 |

కొంకాయ నూనె (37½ పౌనులు గల డబ్బా)

| | |
|---|---|
| ఒకటి- ఎ బ్రాండ్ | |
| క్వాలిటీ | రు. 39-14-9 |
| యస్. బ్రాండ్ | 40-0-9 |

## ఢిల్లీ మార్కెట్ ధరలు

కిషీన్‌లాల్ పరియా మల్, సుగంధ ద్రవ్యముల కమిషన్ ఏజెంట్లు గడోడియా మార్కెటు, ఢిల్లీ.

ఢిల్లీ, సెప్టెంబరు 25: 84½ పౌనుల మణుగు 1 కి ధరలు మిరియాలు 680-0-0 లవంగాలు 305 దాలచిన చెక్క 110-0-0 గోంద 186-0-0 ఏలకులు మేలర్ 175-185 దక్కన్ (తేరు 1-కి) రు. 28-34-0-0 వక్కలు పెనాంగ్ (మణుగు 1-కి) 93-0-0 సింహాళం 88-0-0 మంగుళూరు 120 హన్స 86-0-0 పసుపు సంగ్లి 38-0-0 ఈరోడ్ 32-40-0-0 నిజామాబాద్ 29-28-0-0 దుగ్గిరాల 34- గత్తా 29-0-0 కథోర 86-0-0 కొబ్బరి - కిస్తారు 98. వగ్గుబియ్యం 41-0-0 పెరవ కాయలు 80-90 తెల్లకంకర 60-85. దవియాలు, చిన్నవి- 80-90, పెద్దవి 70-70 అక్కాల్ మాల్వా 36-0-0 కర్నూలు 40- హోప్ 55-70, మెంతులు 26-27 మామిడి పదుగు 30-70, బొప్పాయిగింజలు 64-65 మెహన్‌దీ పూర్‌మాన్కు 40-, బాదం 170 కిసమిస 120-0-0 జీడిపప్పు 186 192.

## బొంబై వెండి బంగారు మార్కెట్

బొంబై, సెప్టెం 26: నేటిమధ్యాహ్నం 2-16 గం॥లకు బొంబై వెండి-బంగారు మార్కెటుధరలు: వెండి (100 తు) రు 188-12-0, బంగారం (తు 1 కి) రు. 111-5-0, సావరిన్ 1 కి రు 77-2-0.



Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St. Madras.